

# అంకితం

శా॥ బౌద్ధా ప్రజ్ఞుఁడు తత్త్వవేత్త, జగదారాధ్యుండు, సర్వజ్ఞుఁడు
న్నాధారమ్ముగఁ దత్త్వభేదముఁ దాఁ జాటెం జనంద్రీ యిలన్,
బోధానందుఁడును జితాత్ముఁడును సంబుద్ధుండునై గౌతమో
ద్బోధల్వార్చెఁ నాడు ముష్కరతఁబాయ న్నందుకో పూజ్యుఁడా!

ఉ॥ ఆంధ్రుఁడవై హర్షముగ దా యుపరాష్ట్రపతీ! కడింది, నే
నాంధ్రుఁడ, బోధి భాస్కరుఁడ, నా దిమ బౌద్ధమత ప్రచారకు,
డాంధ్ర కవి ప్రపంచమున నాదర మొప్పఁగ బుద్ధ ధర్మము
న్నాంధ్రమునందుఁ గూర్చి తది యంకితమిచ్చెద నీకు నాంధ్రుఁడా!

మ॥ ఇది నా స్వార్థముఁ గోరి కాదు సుమి, నే నిర్దారుణిం ధర్మముం
బదిలమ్ముం బొనరింపఁగోరి యిపు డీభారమ్ముఁ జేపట్టితిన్,
బెదిపే లిచ్చినఁ దీరఁబోదు ధనలోభంబేని దారిద్ర్యమే
న్మది హర్షించెద నాదు కావ్యముఁ బరామర్శించిన న్మాన్యుఁడా!

ఆంధ్ర ప్రజానీకానికీ, అద్వారా ప్రపంచ ప్రజానీకానికి

కైకలూరు తాలూకా వరహాపట్నం గ్రామస్థుల సంక్రాంతి

కానుక




బుద్ధం సరణం గచ్ఛామి

ధమ్మం సరణం గచ్ఛామి

సంఘం సరణం గచ్ఛామి

# తొలిపలుకు

నాగరికతా పరిణామంలో ఉత్పత్తి పరికరాలనుబట్టి రాతియుగం, రాగి యుగం, లోహయుగం, యంత్రయుగం అనీ, సాంఘిక వ్యవస్థనుబట్టి గణతంత్రం (Primitive Communism), నూతధర్మం (Slavery), కులధర్మం (Feudalism) ధనతంత్రం (Capitalism) శ్రమతంత్రం (Dictatorship of the Proletariat) సమతంత్రం (Communism) అనీ స్పష్టమైన దశలు కనుపిస్తున్నాయి. 'కులధర్మం' నుండి 'సమతంత్రం' వైపుకు ఆసియాకంటె యూరపే త్వరితగతిని ప్రయాణమిస్తున్నా, 'గణతంత్ర' నుండి కులధర్మానికి ప్రయాణించటంలో ఆసియాదే ముందడుగయింది. ఇందులో నాయకత్వం భారతదేశమే వహించింది.

ఒక సంఘతంత్రంనుండి మరో సంఘతంత్రంలోకి మార్పు అవసరమయినప్పుడల్లా ఒకొక్క తత్త్వవేత్త బయలుదేరి సంఘాన్ని ముందుకు నడిపించినట్లు చరిత్ర చదివిన యెవరికైనా బోధపడుతుంది. అయితే ఒకొక్క తత్త్వవేత్త ముందు చూపుతో తన తక్షణ కర్తవ్యాన్నేగాక తరువాత రాదగు మార్పులనుగూడా సూచించ గలుగుతారు. బుద్ధుడీ తరగతికి చెందినవాడు.

ప్రపంచంలోకల్లా అతి ప్రాచీనమయిన నాగరికతల్లో ఒకదానికి భారతదేశం పుట్టినిల్లన్ని అందరూ అంగీకరించినదే. అయితే రాజకీయంగా, సాంఘికంగా ఆర్థికంగా దాని అర్థం గుర్తించ నిరాకరిస్తున్నారు. భారతదేశంలో క్రీస్తుకు పూర్వమే, ఆరవశతాబ్దానికే నూతధర్మం తుదముట్టి కులధర్మం కుదురుకొన్నది. బుద్ధుడు కులధర్మం మీద తిరుగుబాటు నడిపించాడు. ఆ తిరుగుబాటు తత్త్వం యీనాటికీ మన కుపయోగ పడుతుందనే నమ్మకంతోనూ, బుద్ధుణ్ణి గురించి నేడు బహుధా ప్రచలితంగా ఉన్న అపోహలను తొలగించే ఉద్దేశంతోను, యీ శతకాన్ని మీ ముందుంచుతున్నాను. అయితే బుద్ధధర్మం ఈనాడు భారతంలో ఎందుచేత నిలువకుండా పోయిందంటే, కులధర్మాన్ని పునరుద్ధరింప పూనుకొన్న గుప్త రాజుల ప్రతీపచర్యలే కారణం అని గుర్తుంచుకోవాలి.

పాత లేకుండా కొత్త లేదు. పాతయంతా మంచిదని నేను కాని పాతలో ఉన్న మంచిని మానటం తగదు. అయితే అసలు పాతచరిత్ర యేమిటో తెలిసేగదా, అందులో యేది మంచిదో తెలుసుకొనగలిగేది? అందుచేత పాత చరిత్రను ప్రచారం చేయడానికి 'ఆది బౌద్ధ మిషను' పూనుకొన్నది. ఈ కృషిలో మీ చేయూత ఎంతైనా అవసరం. మున్ముందు త్వరలో వెలువరుబోయే "సంఘ" అనే మాసపత్రికకు మీ చందాలను ముందు పంపితే సంతోషం. వివరాలకోసం ఉత్సాహమున్నవారు ఆది బౌద్ధమిషను, విజయవాడ-2 అడ్రసుకు వ్రాయ ప్రార్థన. సెలవు

విజయవాడ
16—1—1953

ఆచార్య బోధిభాస్కర,
కృతికర్త

# బుద్ధశతకం

చ॥ ఎవనిగురించి గాథ లవి యెన్నియొ పుట్టి యుల్లసవించెనో
యెవని స్మరించుచుందురిల 'ఏసియ' గొన ప్రజ లున్మదంబుతో
నెవని మతమ్మె యింతవఱ 'కిండియ' కీర్తికిఁ బట్టుకొమ్మయై
యవనిఁ జరించె నట్టి మహామాన్వితు నిన్నుఁ దలంతు బుద్ధుఁడా!

ఉ॥ 'బుద్ధచరిత్రఁ' గూర్చెఁ దగఁ బూజ్యుఁడు నాకుఁ బితామహుండు తా
సిద్ధుఁడు 'చెళ్ళపిళ్ళ' యిక శిష్యుఁడు కాటురి మద్గురుండు తా
ద్ధరఁ బింగళిం గలిసి యేర్పడ వ్రాయఁగ 'సంఘగాథ' నే
బద్ధమొనర్తుఁ 'ధర్మమునుఁ' బండిత మాన్యముగాఁగ బుద్ధుఁడా!

మ॥ ఒక వందన్రచియింతుఁ బద్యముల నా యుజ్జ్వల్లభూ, భాస్కరా!
యిక నీకుం గవియన్న బిర్దురులు తా మీయం బనేమోయన,
నొక సామ్రాట్టవు నీవు సర్వులును నే నోయీ యన న్సంపద
ల్సకిరి బాసి శ్రమించి కన్గొనిన సత్సారమ్ముపై బుద్ధుఁడా!

మ॥ కృతి నేఁ జేసెద నీదు ధర్మ మిల నుత్కృష్టంబుగాఁ జూపఁగన్,
గతియందుం గల దోషము వెలికి లాగం జూడఁగా నేమి? నేఁ
బ్రతినం బూనితి భూమి నందరికిఁ ద్వత్ప్రజ్ఞప్తి బోధింపగ,
న్వితముం దప్పిన భారతీయులనుఁ గవ్వింతుం దగన్ బుద్ధుఁడా!

మ॥ అనఁగాఁ గొందరు వేసువేంగునె సిద్ధార్థమ్మునన్? కైత తా
విన సొంపుం గలిగింప నర్థమును భావింపంగఁ బోకుందురో?
మనలో మాటకు మూఢభక్తు లిల నామాట ప్రశంసింతురే?
తినుచో నాల్కనుఁ దాటిపట్టివలె బంధింపన్నెటు ల్బుద్ధుఁడా!

చ॥ చెడుగుడుగూత నాకవిత, వెంగనము ల్వరవళ్లు ద్రాక్కోడి,
న్నడుగవఁగ నెచ్చగింపదిక నాతి స్వతంత్ర నటంచుఁ బర్విడుక్,
దడుపాక యింతలేకఁ దగ ధర్మము జెప్పు నికేరికైన, బా!
ఒడబడదింక నేమసలినో వరియింపఁగఁ దాను బుద్ధుఁడా!

ఉ॥ బుద్ధునిపేరు సెప్పఁగనె పొంగును లోకము శాంతివాంఛమై,
బుద్ధునిమాట విన్నవెసఁ బొంగును లోకము సామ్యవాదియై
బుద్ధుని గాథలెంచి మదిఁ బొంగును లోకము కీర్తి కాంక్ష, సం
బుద్ధునిపేరు నెత్తఁగఁ గుబుద్ధులు క్రుంగరె యంత బుద్ధుడా!

ఉ॥ రక్షణ సేయఁగాఁ బ్రజల రాజ్యము విడి, శ్రమంబునోర్చి, సీ!
భిక్షువుఁగా త్రిఁ జతనిడి భీతినివీడి, పరిభ్రమించి, యా
మోక్షము మోక్షమంచుఁ గడు మోసము సేసెడి మూకనంతతి
న్నిష్ఠుణఁజేసి, యెందరినొ శీలమునం దుసిఁగొల్పి బుద్ధుఁడా!

మ॥ లిపియే కానఁగరాని కాలమునఁ బా ళిభా ష నీ ధర్మము
న్విపులమ్ము న్ప్రచరించి, యెల్లెసలకు న్పంపి నీ శిష్యుల
న్విపినమ్ము ల్నగరమ్ముల న్నొకటిగా వేవేఁ ప్రచారించి, నీ
రిపు సంఘమ్ముల నుత్తరించి జయభేరి న్వేసితో బుద్ధుఁడా!

శా॥ దండంబుం ధరియింపరే ఋషులు నిద్రామంబుఁ బాలింపఁ గో
దండంబు న్వెసఁబూని రాఘవుఁడు తా దండింపఁడే రాము, బ్ర
హ్మాండంబుం దగ నూపఁడే హలముచే నా యాదవుం, డౌర! నీ
యండం జేరిన ఫంఘమేకదవె నీ యణ్వస్త్రమో బుద్ధుఁడా!

ఉ॥ దేవుఁడ నంచొకండు మఱి దేవుని పుత్రుఁడ నంచు నొక్కఁడున్
దేవుని దూత నంచొకఁడుఁ దెల్పెడె వా రి నిజమ్ముగా!
నీ విట ధర్మచక్రమున నల్పఁగ దేవతలందరు న్వెసన్
క్రోవయి త్రొక్కరే భువిని గ్రొవ్వుటయేమి తాము బుద్ధుఁడా!

చ॥ భువి నిపుడున్న పెద్దమతములు ప్రకాశింపఁగ మూఁడె యందును
న్మిగులఁ బురాతనమ్మగు రహించును నీ మత మద్దిశాఖలై
యవని నిరాత్మవాదమున నాదట మించఁగ హిందువుల్ భళీ!
యువిఁగల మాడ్కి నీవు నొక యుజ్జ్వల దేవత వంద్రు బుద్ధుఁడా!

ఉ॥ మతములటన్న మానవుల మాత్రము యోచన లేకి దేవుని
స్తుతిము భజించుచుండుటయె సారమునం దలపోతు రీ యిలన్
గతి మఱి యేమొ దౌర్యము ఖండనఁ జేయఁగ, నాఁడు దానికిన్
బతియొక దైవమంచు నని వారము సెప్పఁగ నేల బుద్ధుఁడా!

చ॥ మతములవన్నియుం గలిగె మానవసంతతి నద్ధరింప నే
వితమున గాని నిన్న మతభేదములంచునఁ బల్కరే భువి
న్మతి యొకయింత లేకఁ దగ మాటలయర్థ మెఱుంగకెట్టె భళీ!
మతమును వాదముల్ నిజము మాటల భేదముకాదె బుద్ధుఁడా!

మ॥ కనమే కాంగ్రెసు కమ్యూనిస్టులని నిక్కాలమ్మునన్ వాదము
ల్వినమే పెక్కులు లం పేరు లవి విన్వైధిం జరింపంగఁ దా
మనగాఁ గాదియె యజ్ఞతన్మునఁగినే సన్నీ సమమ్మంచు, తే
లనగాఁ జెల్లునె భేదము న్మతములం దావంతయు న్బుద్ధుఁడా!

ఉ॥ క్రీస్తను యూదొకండు పరికించి యిలం గల బొమ్మపూజఁ, దా
'నాస్తి' గదోయి! దేవునికి నామము, రూప మనంగ నాతనిన్
గస్తిం ముంచి కంబమునఁ గట్టియు యూదులు గండుమూర్ఖులై
మస్తము ముళ్ళతీగ నిడి మాయురె! చంపిరిగాదె బుద్ధుఁడా!

ఉ॥ క్రీస్తునె దేవుఁడంచు భువిఁ బెద్దపుఁ బూజలు సేయఁ గా ప్రజ
ల్మస్కము తెగన్ నరికి పూర్వముఁ గూల్చెఁ దా మహమ్మద
ముస్త తురుష్కు లైధ లవి ద్రోలఁగ గ్రీకుల రోమునకున్నటన్
క్రైస్తవ రాపు చేయు చెడుకర్మలఁ ద్రుంపరె వారు బుద్ధుఁడా!

ఉ॥ దేవుఁడనంగ నర్థమొక నీయుడుఁ డున్నను, నీవు చెప్పవే
"శ్రీవనుఁ జూపఁగ న్గదికిఁ దోడ్పడఁజాలను నసిద్ధికై
నీవయి దారిచూపు దెస న్వడి ద్రోలంగు నవిద్య" యంచు స
బ్భవము ఎడి బొమ్మలకు భక్తిఁ జూప ఫలంబే? బుద్ధుఁడా!

ఉ॥ దేవుఁడ వంచు నిన్గొలువ దేశము లెన్నియొ యీసుచే నిటన్
బ్రోవయి బ్రాహ్మణోత్తములు బుద్ధుఁడు నేరకుఁడంచుఁ బల్కరే?
నీవొక రాజుబోట నిల నీమత మింతగఁ బ్రాకెనంట, చూ
రా! విను, రామకృష్ణు లిల రాజులుగారొకొ తాము బుద్ధుఁడ!

ఉ॥ కావ్యములన్ని నీవెనుకఁ గాదె రచించిరి సంస్కృతమ్మునన్?
దివ్యము నాది కావ్యమన దిట్టలు నందొక రామగాథయే,
భవ్యమునంగఁ దత్కథను భావనఁ గిరాతుఁ బొందనన్
భావ్యమె రాముఁడుం బొకఁడు భాసిలె నీయిలనంట? బుద్ధుఁడ!

ఉ॥ "పంచమవేదమన్బిరుదు భారతకావ్యమునంద రూఢియా,
నంచితరీతిఁ జెప్పనది యాదిమ భారత సంవిధానముల్
సంచితమయ్యె నార్యుల ప్రశస్తతరంబగు పూర్వజీవితం
బెంచఁగ వేదమం దనుమ కెట్లగుఁ బండితులండ్రు బుద్ధుఁడా!

మ॥ ఇక రోనైన నధర్మ్య వేదమున నీవాక్రాంతయు న్స్త్రవే
లోకా! నీ వైరులు సైతముం దడవఁగా నుంకింపరే చర్చలన్?
ఇక నీ పిమ్మటఁ బుట్టె భారతమునం జేఁ జెప్పఁగాఁ బాలదో?
యిక వాసిమ్మదియేల? వేదములు మూఁడేగావె మును బుద్ధుఁడా!

మ॥ కలరే లేరో యెఱుంగఁజాల మిపుడా కాలమ్మునం గృష్ణుఁడు
న్బలరాముం డక నీవు దక్కఁ గలరే భావింపఁగాఁ [illegible]?
బలుకం జచ్చిరి నీచలేవనుచు దుర్భాషల్మహాయానుల
న్మలిన త్మ్మల్గమిఁ గూడి కొందరంద ని మార్గమ్మో? సీ! బుద్ధుఁడా!

ఉ॥ ఆర్గురు బుద్ధులుండిరని యంటివి నీవిల నీరు మున్ను, వా
రార్గురు నీదు ధర్మమునె యాదట నల్పుట నిబ్భవిల్, భళీ!
యార్గురటన్న నీమ మరియుం గనరాదని యంటిగాదె! నీ
వార్గురి నేడుఁ జేసితివి యాపయి నెందరు లేరు? బుద్ధుఁడా!

ఉ॥ హిందువులన్న పేరు తొల హీనముగాఁ దలఁపోయ భారతం,
బెంద మటించు నెంచి యిపు డందరు హిందువులే యటండ్రు సీ!
మందమతుల్యథార్థమును మాహాత్మ్యముచేత నెఱుంగఁజాల రీ
వెందును హిందుదేశమని యెన్నఁడుఁ బల్కవుగాదె బుద్ధుఁడా

శా॥ ఉన్నాడొక్కఁడు మూమహేశ్వరుఁ డనన్నుద్వారముం జేయఁగా
విజ్ఞానమ్మునఁగ వెళ్ళఁదీసి యొక ఋగ్వేదోక్తమంత్రమ్ముఁ దా
మిన్నున్నమ్మఁగ నార్చుచుండె నిట యశ్వమేధ మ్ప్రయోగించి, యో
యన్నా వాండుపులన్న పేరు మాఁదే యంచు భళీ! బుద్ధుఁడా!

ఉ॥ తాతకు నేర్పఁగాఁ దరమె దగ్గఱి లిలన్నినుమించి యేరు మా
ప్రాత చరిత్రఁగూర్చి తగఁగారము మట్టఁగఁ జెప్పఁగల్గుఁ బో!
సూతుఁడు శౌనకుండు మరి సోదెలనైననుఁ గానరారు నీ
ఘాతముల న్భళీ! త్రిపిటకమ్ముల నెచ్చటనేని బుద్ధుఁడా!

చ॥ అయిననుఁ జెప్పమందు రిట యెంతకు మున్నుఁగలట్టి గాధల
న్వయినము గాఁగ వ్యాసుఁ డల వ్రాసెనటంచును, పేరులన్న నో
నయమగు నేటి వ్రాతఁ గనఁ గ్నగు నట్టివి నమ్మరేరు న
గ్భయమున నీతిఁ జెప్ప మన ప్రాతపురాణములందు బుద్ధుఁడా!

చ॥ కులము గోత్రముల్లలవె! కుట్రయనందగుఁ గాక, జెల్లునే
కలియుగమందు ద్వాపరపుఁ గర్మయు ధర్మము? కృష్ణుఁ బ్రాభవ
మ్ములు నదియెంతో జెప్పినను నేమి ఫలం బది త్రేతనుండెనే?
యలవియె యేరికైన నిను నంటగ నీ యుగమందు? బుద్ధుఁడా!

మ॥ కులము గ్గోత్రము లంచు దేశ మిది రే! ఘోరమ్ముగాఁ జీలదే,
బలముల్ గోల్పడి భిన్నభిన్నమయి పల్బాధల్భరింపం బ్రజల్?
చలముల్వీడి చరిత్ర సర్వమును నే సంధించి చూడంగ, జా
తు లవెన్నో యిటవచ్చి కూడవె? నదీతుల్యంబుగా బుద్ధుఁడా!

చ॥ కులము లటన్న హెంచువులు గొప్పగఁ జూతురు మాంసరక్తము
ల్మలమును మూత్రముల్ జెమట మానిసులన్నమహాఁగదా! యిక
గలదె నిజమ్ము నీదు గుణకర్మలఁ బోలును నీ కులమ్మనన్ ?
ఇల గుణకర్మము ల్పుటక నెరకేఁ గల్గవుగాదె బుద్ధుఁడా!

ఉ॥ ద్రావిడు లార్యులు న్యావనదంశును మీఁదఁ గుషాణు లావయి
న్భావనసేయ నెందరిట బల్మిమెయి న్వడి నెత్తివచ్చిరో!
యేవ జనింపఁబల్కుఁ దగదేరికినైన "మహమ్మదీయులే
పావన భారతీయులకు బద్ధ విరోధు"లటంమి బుద్ధుఁడా!

చ॥ ఎఱిఁగి యెఱింగి నీపయిని నెన్ని యబద్ధము లల్లినం ధరన్
దరమగు నెల్లు దబ్బరలఁ దథ్యముసేయఁగ? "నుర్వి దుఃఖ సం
హారణమిదెక్క ధర్మమున నన్యము సున్న మహాత్వమిద్దియే
నరమరలేని సత్యమిది"యంచు వచించితిగాదె బుద్ధుఁడా!

మ॥ అరెరే! రాజులపంచఁజేరి యతిహేయంపుం బనుల్సేయఁగా
దొరకొన్నట్టి యధర్ములెందరో కడు ద్రోహమ్ము నొనంచుఁ దా
మరయ జ్ఞాలకఁ దృష్ణచేఁ దమరుఁ దామాచార్యులై వాద్ధుల
న్బిరుదుంబూని నటింపరే యిలను నీపేరన్ గటా! బుద్ధుఁడా!

ఉ॥ నారమొకింతలేని పదజాలము నూదుచు నిల్లువీడి యే
గ్రారడి విద్యనో కఱచి కాలముఁ బుచ్చెదు వారిచేఁ బ్రజ
ల్ఘోరముగాఁ బురాకృతపుఁ గోతినిఁ గూలఁగ నుద్ధరింపవే
'కారణధర్మము' న్నెరపి కార్యమునం బురిఁగొల్పి బుద్ధుఁడా!

మ॥ అయయో, తృష్ణయె దుఃఖమంతటం మూలాధారమంచుం దగ
న్నయమతిం యఁగ నీవు గర్మమును, దానన్నీడి నీ శిష్యులే
భయముఁ బేక మఁరంబుల న్నకవరే పాపంబిలం జౌర్యమున్
దయ యు స్సత్య మహింస శౌచములె త్వద్ధర్మంబులా బుద్ధుఁడా!

ఉ॥ ఎవ్వనిచే జనించు జగ? మెవ్వనిలోపల నుండు లనమై?
యెవ్వనియందు డిందుఁ? బరమేశ్వరుఁ డెవ్వఁడు? మూలకారణం
బెవ్వఁ? డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు? సర్వముఁ దానయైన వాఁ
డెవ్వఁడు లేడటంచు భువి నెప్పుడుఁ జాటితిగాదె బుద్ధుఁడా!

ఉ॥ "దుఃఖము, దుఃఖకారణము దుఃఖనిరోధము తన్నివృత్తికై
దుఃఖము లన్వరించుటతి యూష్యము నయ్యెడు మార్గమంచు, మా
దుఃఖనివారణమ్మునకుఁ దోడగు సత్యములుర్వి నాల్గె, పో,
దుఃఖముఁ ద్రుంచు మార్గమది దోసిలిపం' డన యంటి బుద్ధుఁడా!

ఉ। "దుఃఖము దుఃఖకారణము దూరముఁ జేయఁ దూరమాపలన్,
దుఃఖితు లంగనం దురితదూరులు కాఁగలరంచుఁ జెప్పి, మా
దుఃఖనివారణమ్మునకు దుర్లభము న్గను దుస్సహమ్ములై
దుఃఖముఁ బెంచు నీ ప్రఫల దూష్యము" లంటివి కాదె బుద్ధుఁడా!

ఉ॥ జన్మపరంపరం దునుమఁ జాలునటందుము పండితబ్రువు,
ల్జన్మము నాజ మంచెఱుఁగఁజాలరు మూర్ఖులు తా మిక "మ్మన
ర్జన్మమొకల్గు నాత్మ"కన శాశ్వతవాదు, లనాత్మవాదివై
"జన్మము తృష్ణ' కంచు భువిఁ జక్కఁగఁ జాటితి కాదె బుద్ధుఁడా!

శా॥ సమ్యగ్దృష్టి గ్రహింప మానవుఁడు సత్సంకల్పము ల్గల్గ డిక్
సమ్యగ్వాక్కుల నాడుచు న్నిరతము న్సత్కర్మలం జేయుచు
న్సమ్యగ్వృత్తిని జీవనం గడపుచు న్సద్యత్నా యుక్తుఁడై
సమ్యగ్యోగ సమాధిఁ గాంచు స్మృతితో సద్ధర్మము న్బుద్ధుఁడా

మ॥ కనఁగా సర్వ మనిత్య మీభవిని యిక్కాయమ్ము నైతమ్ము దా
ననఁగాఁ జెప్పఁద వారిఁకిండఁగ నరాత్మం బౌట విజ్ఞానమా
త్రమునం దేహము కట్టెయూ దనుక మీపంచస్కంధములే వాసనం
చనకే నీవది గుర్తెఱుంగుటయ సమ్యగ్దృష్టియౌ బుద్ధుఁడా!

శా॥ సంకల్పింపరు నీచమానవులిలన్ సంఘంబు సేవింపఁగా
సంకల్పించియు మధ్యము ల్ఫలితము ల్నాశించి వెన్కాడు ద
త్సంకల్పంబుల నుత్తము ల్గ్రమముగా సాధింపఁగాఁ బూనరే
సంకల్పంబిక స్వార్థమే యయినఁ దా శాపందు ల్గదా బుద్ధుఁడా!

ఉ॥ మైత్రిని మాటలం జనుల మేలును జెప్పుచు నుండఁగావలెన్,
శత్రు ననందు స్వార్థమిడి చెప్పఁగరాదిల సత్యమేని పో
రి తెఱఁ నోర్వఁబల్కుటది రీతియె గాదిక నీకిఁకంజుమీ!
చిత్తమునందు హాస్యమును జెప్పగ ధర్మము గాదు బుద్ధుఁడా!

చ॥ విపుల మరాగ్రహమ్ము మితిమీఱిన శాంతము చూపరాదు, పో
త్తివిలి దురాశయందో మరి దానములందో చరింపరాదు సూ
గవిసి దురాక్రమంబునకొ కాక విరాగముచేత భిక్షకో
భువిని గడంగకే కలుగు పుణ్యఫలంబులు తాము బుద్ధుఁడా!

ఉ। సేద్యముఁ జేయువారి కిలఁ జేను వి త్తిన మాయఁగావలె
విద్యలఁ గల్గువారికయి వేతనము ల్సముకూర్పఁగాఁదకున్,
హృద్యముగాఁగఁ బామరుల నీయిల జ్ఞానులఁ జేయుఁ గొప్పనిన్
విద్యయు ఖాద్యముం దరుగ విడదు దుఃఖ మొకింత బుద్ధుఁడా!

శా॥ వ్యాయామమ్మది చేయకుండ బలియ, న్వ్యాపంద్రుపో వైష్ణ్య తే
యాయాసమ్మును లేకయున్న నిసీ యానామరా! యంద్రిలన్
నే యత్నమ్మునుఁ జేయకున్నఁ గలదె ర్వ్యాణ సౌఖ్య? మ్మికన్
గ యాకల్పముఁ జేయ జ్ఞానమెటులన్ గాంచంగనౌ బుద్ధుఁడా?

ఉ॥ కుక్కనుఁ జావబాదినను కొంపల దూరుచునుండు పూటికై
ముక్కువ కోడ లగ్గది యమానుషహాటను మానవుండికన్
దక్కిన జీవరాశివలె ధర్మముమర్వఁగఁ జెల్లునే భువి?
న్నుకుననుఁ దమ్మివేయ స్మృతి బుద్ధియెటు ల్వికసించు? బుద్ధుఁడా!

ఉ॥ గాఢమటంచు ధర్మమును కొందరు బోద్ధలు, పామరుల్గదే!
మూఢతఁ బెంచుఁగాక మరి ముక్కును మూసికొనంగ నేమగున్?
గాఢసమాధి యందుఁ గడుఁ గాఢముగాఁ దలపోయుటం గదా
రూఢిగ ధర్మమార్గము నిరూపణమయ్యెను నెంచ బుద్ధుఁడా!

ఉ॥ బట్టకుఁ బొట్టకై భువినిఁ బాటది తప్పదు భిక్షమెత్తుటో,
మట్టముఁ జేసి భూమినిక మానుగ సేద్యముఁ జేయుటో తగున్,
గొట్టముఁ దొక్కటే తరుగు పూటికి భిక్షము నెత్తఁగా నిటన్,
గుట్టుగ జీవికం గడుపఁ గోరినభూమియె లేదు బుద్ధుఁడా!

ఉ॥ భోగముల న్మనింగి కడు పొందిరివోఁ బతనమ్ము తప్పునే?
రాగముఁ బెంచు, సర్వమును రావల నకలించు, సంతఁ దా
రాఁగల దొక్క దుఃఖ మిక తాలఁగఁ బోదొక రవ్వయేని పో
భోగమువంటి శత్రువిలఁ బోల్పఁగ లే దొకటైన బుద్ధుఁడా

ఉ॥ కీరుఁ డిలం గలట్ల యవధు ల్గురుతించి మెలంగుచుండు, పో
భూరి గుణ ధ్వ్యఁడౌట నక మూఢునిమాడ్కి భయంపడుంచు త
నేరిం, సంకెల ల్గలుగ నిన్నవి కొయ్యవి యంతమంటెనూ
ఘోరముగాఁ దలంచు దన కుండలము ల్సతిఁ బుత్రు బుద్ధుఁడా!

ఉ॥ సన్యాసు ల్భవి నిప్పు డిల్లువిడి కాషాయమ్ము మైఁదాల్చియున్
అన్యాయంబుగ విత్తముల్ బడయుఁ డా నందందు గారాడుచున్
అన్యుల్ జేయు పరిశ్రమల్ దమకునై యాశింపరే? కాక పో
శూన్యప్రాప్తిఁ బరమాత్మఁగోరి యెవడే న్నుషిక్కుంచునే? బుద్ధుఁడా!

శా॥ సన్యాసంబున శక్తిమంతుల వృథా నాశంబుగఁ బోకుంటయే,
సన్యాసంబున స్వార్థదృష్టి నిల దుస్సంపాదన న్మాను టే
సన్యాసంబున సంఘసేవకయి సత్యాంగత్యముల్ జేయు టే
సన్యాసంబున సర్వుల న్సమముగాఁ జాటించు టే బుద్ధుఁడా!

ఉ॥ భావము లెన్నియో భువినిఁ బైకొని మానవులన్ గలంచు, నా
భావములందుఁ గొన్నియె స్వభావము లెంచను, నందునున్ భళీ!
భావన సేయఁదగ్గ వొకపాలయి యుండును, వానిలో ముం
బ్రోవఁగఁజాలు నెన్ని? యవి బుద్ధినిఁగాదె జనించు బుద్ధుఁడా!

ఉ॥ ఒంటరిపాటు మేలిలను నోజము తాఁ జెడకుండ నుంటకై,
తుంటరి స్నేహమెల్లఁ జెడు గ్రోవల కీడ్చుటకై యగుంజుమీ
యొంటిగ యోచన న్నలుప నొప్పనుగాకొక మూర్ఖునం ధరన్
జంటగఁ జేసికొన్నఁ గల శక్తియు నాశమునొందు బుద్ధుఁడా!

ఉ॥ హేతువులేని కార్యమును, పే యము కానిది స్వార్థచింతయున్
బూతము గాని పుణ్యమును, పుత్రులఁ బార్చిన లోకసేవయున్
శీతము లేని చందనముఁ జిత్తకులంబున శాంతిలాభమున్
బోతును వీడు పెంటియును భూమి నెటన్ గనరావు బుద్ధుఁడా!

మ॥ మనసే మూలము శోకమంతటికి ధర్మంబుల్ధరంగల్గ నా
మనసే కారణ, మొండు కాదు సుమి! కామంబల్మహాద్బ ధ్యహ
మ్మనఁగాఁ జెల్లునవన్ని భావములె, ద్రవ్యంబందు లేదొక్కఁడున్
న్మనవే పేరులు వేయి పుట్టగొడుగుల్మాడ్కిం ధరన్ బుద్ధుఁడా!

చ॥ మనమున కల్మషం బునిచి మాటల నాడిన దుఃఖమింకఁ దా
ననయము వెంటనంటు భువి నాదట స్వామి నామముంబలెన్,
ఎనయగు దుఃఖమంతమున నెగ్గగు చేష్టలఁ జేయ నేరిన్
గనరథ చక్రము ఛ్లాయము కాళ్ళను విడనియట్లు బుద్ధుఁడా!

శా॥ ఆకాశంబున రెక్కలన్నిగురినీ, యబ్ధిన్మనుంగంగనీ,
యేకాంతంగల కొండ గహ్వరమునందే మూలవోడాగనీ,
నీ, కోపంబుననైన నొక్కచెడుఁ దాఁ జేయంగ నేవారికిన్,
'లోకేత్వమ్మును దాకుకొమ్ము నరయన్ లాభమ్మిలన్ బుద్ధ

ఉ। తప్పిది చేయుచుండుటయు దాసుడనంటయు మానవాళికి
న్నొప్పునె? చేయరానిపని కొడ్డినఁ దప్పునె దుష్ఫలంబు తాఁ?
జెప్పుము బ్రహ్మయైన నిలఁజేసిన తప్పును ద్రుంపఁగల్గునే?
చొప్పది తప్పినం గుటము పొట్టను దీయఁగనే? బుద్ధుఁడా

శా॥ ఈలోకమ్మున శిక్షతప్పదన నేనేదోషముం జేసిన
న్నాలోకమ్ముల కోడ నేమిపనియో? ఆ మెట్టు వేదాంతులు
న్నాలోక్యమ్మునుఁగోరి చేయు తపమాశంజంపునే? యింక వా
రే లోకమ్మున కేగినం దొలఁగునే యీదు ఖమో? బుద్ధుఁడా!

శా॥ ఆమాలన్నను ముక్కుఁబట్టుకొనఁగా నాయుగ్రబుద్ధు వ్యాస
న్నామీదంబడ జాతు 'రియాలను' రాగీతులఁ బాలుగే
మేమోచేసియు శిక్షలేకఁగడు హాయింబొంది జీవింతురం
చే మందున్నిక? ధర్మసూక్ష్మమదె యంచే జెప్పెదఁ బుద్ధుఁడా

ఉ। చిత్తమలంబు లో జనులుచేసెడి దాన మనర్థకమ్మెయౌఁ,
గొత్తముఁ జేతఁబట్టుకొని బొంగురువోవఁగ గొంతుకట్టదగట
జెలదిరేగిపోవ రొదజేయఁగ నేమిఫలంబు గల్గుఁ? దాఁ
జిత్తము మాత్రమేదొ యొక చెత్తపయి న్నిలుపంగ బుద్ధుఁడా

ఉ॥ ఈయిలఁగల్గు భాగ్యముల నెల్లనుఁ గోరి దురాశచే జను
లేయిబవ భ్రమించి పలురీతులఁ గ్రిందును మీదు నె చునుట
బోయెదు దానికై మిగులఁ గొక్కుచుఁ బోరుచుఁ మీదటం భళీ!
వేయి శుభమ్ములున్న నొకవీసముఁ గానరు కాదె బుద్ధుఁడా!

శా॥ నేనంచు న్నొక గోడఁ గట్టుకొని యీ నన్నదే శాశ్వతం
వౌనంచుఁ గడు భ్రాంతిఁ జెందితి, మివుల న్నారాటముం బొంద, నా
యానందమ్మిఁకొ మాయమై చనఁగ, నాయా దుఃఖభారమ్ముచేఁ
బానంజాలను 'సంపు ధర్మము' సీ! కాసంతయుఁ బుద్ధుఁడా!

శా॥ నేను న్నేనని ఎక్కుటేలనో కదా! నెనన్న నేమో తగ
న్నీ నాయొజ్జలు తెల్పి చెప్పఁగలరే! నీకంటె వేరన్న వి
జ్ఞానమ్మొక్కఁడు దక్కనింకఁగలదే జాతమ్మునో భేద మా
పై నాకున్మరి నీకుఁ బిండమున రూపంబందునుఁ? బుద్ధుఁడా!

శా॥ నీవు న్నేనను తారతమ్యమె కదా నీవన్న విన్నాణ మ
న్నాభవ, మ్మద్ది యవిద్యఁగాదె బలియు న్నెబ్బపై నిగాతింపులఁ
జవంబోవ దిదెపు దుష్టుగు నే సంగత్యము న్నీవడి, యే
వేపోగాం కెమకోక్కల న్వదలి జీవింప న్వలె న్బుద్ధుఁడా!

ఉ॥ ఆత్మయనంగ సంస్కృతమునందున నేనను మాటకు న్సుమి
మ్మాత్మ పదార్థమొంటు కలదా, యెటనైనను రూపవంతమై?
యాత్మకె యర్థమెద్దియును నైన స్ఫురింపని యప్పుడింక వి
శ్వాత్మయదేడ? న్నర్థమును వాక్కును వేరెటులౌను? బుద్ధుఁడా!

ఉ॥ 'ఏ'నన నొక్కభావమన నెట్లది నిత్యమగు? న్నిరంతర
మ్మేననుచు న్మనుష్యుఁడిల నెన్నియొమారులు పల్కఁగాదె? యా
నేను లవన్నియు న్నొకటె? నేనన రూపమొ, వేదనో, సువి
జ్ఞానమొ, సంజ్ఞయో, మరియు సంస్కృతియో యగుచుండు బుద్ధుఁడా!

శా॥ ఏనే లేనపుడింక గాదిచునఁగా నేమున్నదో యిచ్చటన్ ?
దానిన్ దీనినిఁగోరి యత్నమున సద్గ్రాసం న్వసందెచ్చి యీ
పైనం దానిని రక్షసేయుకొంఆకై వాళ్లెన్నియో సైచియున్,
బోనీకుండఁగ నాపనెట్లు ? కడుదుర్బోధమ్ము సూ బుద్ధుఁడా!

ఉ। స్కంధము లైదును న్నరయఁ జాల నవత్యముగాఁ జేతఁ ద
ద్బంధము లూడఁదన్ని యిహాగ ధల న్నిటిఁ బారఁద్రోలనె
ంధనము ల్వ్రాతాశనున కీవలకు న్వైస లాగి వేయఁగా
నంధుఁడుగాడె తా ననిమిషాలి నగ్రణి యయ్యె బుద్ధుఁడా!

శా॥ 'నేనే వేదం కాదె నీవు చెప్పుదు న్నే నన్నమాట న్వశీ!
తేనేతే వెటనే చర్చలఁ గడుం దీవ్రమ్ముగా పట్టులం
దైనన్ 'బల్కు తథాగతుం డనుచు రుద్ధాత్ముండవై నీమమున్
బోనీకె గుదిఁగుచ్చియుంటివిట నీ బోధ్యంగము ల్బుద్ధుఁడా!

మ। తినకై నెయొంగ పరార్థమైన నొకటే ధర్మమ్ముఁ దాఁదప్ప నే
నొనగూడన్వలె భాగ్యభోగ్యములు తా, మూరన్వలెన్ సౌఖ్యము
ల్ననముం దాన్యముఁ గట్టఁబెట్టఁ గొడు కాధార మ్మగుంగాత నా
కనుచున్ గోరఁగవండు ? వాఁడ యగున్నర్హత్వమో బుద్ధుఁడా

శా॥ నా పెండ్లామును నల్లపూసయినఁ గాన న్రాదె యన్ జింతయు
న్నాపుత్రు ల్నిరు పేదలయిన నెటుల న్నా పేరు రాణించెడి,
న్నాపెట్టెల్వాని వట్టిపోవఁగ నకన్నామాట యేర్పొందుర
న్దాపమ్మద్ది దురాశయుం చనవె నీ ధర్మమ్మునన్ బుద్ధుఁడా!

మ॥ ప్రతివాఁ డొక్క కుటుంబము న్గలిపి దర్పంబు న్వహింపఁగా
నతివేగమ్మునఁ గయ్యముల్ పెరిగి యాయాసమ్ముఁ గల్పింపవే?
సతియంచు న్సుతులంచు సంకుచిత సంసారమ్ము నిర్మించి ప
ర్యాప్తం బొందఁగ నేల! దుష్ప్రథలఁ వే వీడందగు న్బుద్ధుఁడా!

శా॥ తుష్టి న్వీడి స్వచమ్మగాఁ బ్రజలు సంతుష్టిం బ్రశంసించుచున్
"ఇష్టంబున్న పదార్థము న్సయితము న్వాడ్చెనఁ దెక్కడే?
కష్టంబు న్వెసఁ బాపపోవుటకునై కామంబుల న్వీడుడీ,
నష్టం బౌ నల సర్వము" న్నెద రిజ్ఞనమ్మునన్ బుద్ధుఁడా!

ఉ॥ ఇష్టముగల్గినన్ భువి నెయ్యడుగాఁ దినఁజాల రేరునున్
గష్టము దాటఁ గోరుటయుఁ గామము, దాని వీడఁ గష్టమౌ
నష్టము గాఁగఁ బోదిలను నామీముదక్క నికేదియుం జుమీ,
తుష్టియుఁ దృష్ణయుం జనుల దుఃఖముఁ దీర్పఁగ నేవు బుద్ధుఁడా!

ఉ॥ పాపములన్నిఁ బోవిడిచి, భావమునన్ బరిశుద్ధుఁడైనచో
నాపదలంట లేవి కను న్సర్వాతుడం చన నోపు వానిఁ బో
ఆపయిఁ బుణ్యమొక్కటెయ యాతనికిందగు కార్యమౌటచేఁ
బ్రాపయినిల్పు దీనుల కుపాయము చెప్పుచు నెవు బుద్ధుఁడా!

ఉ॥ పాపముఁ జేయకుండుటయుఁ బాయకఁ బుణ్యముఁ జేయుచుంటయున్
లోపల ద్వేషమోహములు లోభమునంబడు చిన్నలంబులన్
దోపఁధనీకయుంగుటను దుఃఖనివృత్తికి నీదుమార్గమౌ
బాపముఁ బుణ్యమొక్కటనఁ బండిత మూర్ఖులుకారె బుద్ధుఁడా!

చ॥ రయమున వీడఁగావలయు రాజ్యము నేని యధర్మమైనచో
భయమది లేదు తృష్ణయను భారము డించగ నంచుఁ బల్కనే!
నియమిత కర్మల న్విడువ నీతిత్రోలంగు నటంచు గీతలు
న్నియమముఁ జేయు, వానినిల నీమము సేయున దేదొ? బుద్ధుఁడా!

శా॥ గీతాగ్రంథ మనంగ సర్వలోక కే గీర్వాణముం జూపుచున్
'శాంతాఖాని'ఁ గడంగి పల్కెదవు 'శాశాంతిం చు నోరూరఁగన్
బాంతాశమ్మునుఁ ద్రవ్వియె తినఁగుఁ, దద్వైరాధ్యము దీర్పఁగా
జేతం గాదల బ్రహ్మకేనియనుచున్ జెప్పంగన బుద్ధుఁడా!

శా॥ ధర్మవ్యాధుఁడనంగ నొక్కఁడిలఁ దా ధర్మంబు రక్షింపఁగాఁ
గర్మణ్యంబు మాంసవిక్రయమునన్ గాలమ్ముఁ దాఁబుచ్చుచున్
"ధర్మంబన్న నిలంగలట్టి యెవరికిన్ దాఁ జంపకుండే నుమీ,
మర్మమ్మిద్ది" యటంచుఁ జెప్పె నది నీమార్గంబె! సీ, బుద్ధుఁడా!

చ॥ తగవది కానిపింపఁగనె ధారుణిఁ గొందఱు చేరి పెద్దలై
తగవుకుఁ గారణమ్ముఁగని ధర్మముఁ జెప్పెడి దిమ్మరేక, సీ
తగవులె తప్పటంచు నొక దండుగ తీర్పు నిచ్చిపోవరే!
తగవులఁ జంపఁగల్గు నిల ధర్మము ధైర్యము, రెండె బుద్ధుఁడా!

ఉ॥ మార్పునుఁ బొందు నిజ్జగతి మారని దేది లభించు పోకినన్
దూర్పునకుఁ బోవు వాని కిలఁ దోడగు నెట్టులు పశ్చిమంబు తాఁ
నార్పఁగఁ గోరి దుఃఖముల నాశ్రయమందఁ దపంబులన్ భళీ!
తీర్పఁగ దుర్లభంబులవి తీవ్రమగుం ద్విగుణమ్ము బుద్ధుఁడా!

ఉ॥ సర్వ మనిత్య మైనపుడు శాశ్వతమెట్లగు నాత్మ యిబ్భువిన్?
బర్వములన్న పుచ్చ మరి పండునె యిత్తఁ వనమ్ము తా, భళ!
యుర్విని సర్వమున్ క్షణికమూరక వాదములేల? నెల్లరున్
గర్వము విడి ధర్మమునుఁ గాంచదగున్ భువి వేగ బుద్ధుఁడా!

చ। క్షణిక మటంచు నీవన నశాశ్వతమం చిల శంకరుండు తా
వణిజులఁ బ్రోగుఁజేసి యరువంబులఁ జెప్పడె? రాజు పల్కఁగన్
గను తిక భృత్యుఁడట్లు యనఁగల్గునె మూల్యము పెసమంత? తా
మ ఖలు మరమ్ములు న్మరియు మాన్యముల న్నమ్మఁగార్చ బుద్ధుఁడా!

ఉ॥ సర్వ మనిత్యమంచు భువిఁ జాటగ నీ పలనాడు శంకరుం
డుర్వి యసత్యమంచుఁ గడు నుద్ధతిఁ బల్కె, జగంబొకండు నేఁ
బర్విడిరాగఁ గొరిచని, భ్రాంతిమునింగియు లజ్జవీడి, తా
సర్వము మిథ్యయంచుఁ బగసాగడె వాద మికేల? బుద్ధుఁడా!

ఉ॥ దేహ మనాత్మ మంచు భువిఁ దెల్లముఁజేయగ నీ, వికన్ భళీ!
సోహమునంచు శంకరుడు శోకమయంబగు నిజ్జగంబుఁ దా
మోహమునందుముంచి కడు మోసముసేయడె! యాత్మసత్యమున్
దేహము మిథ్యయైనఁ గడతేరునె దుఃఖము మాకు? బుద్ధుఁడా!

ఉ॥ దేహముపోలె నాత్మయునుఁ దీరుమనుంచు ప్రణాశనమ్ము ద
న్మోహమున న్మునింగి యిక ముక్తను మానుకి సర్వకాలమున్
సోహమెునంచు నెంచినను శోకము మాయునె? దుర్భ్రమమ్ము సం
దేహమువీడి ప్రోక్కఁదగు ధీరత నీదగు ప్రోవ బుద్ధుఁడా!

మ॥ ఎఱుఁగంజాలరు మూఢమానవులు తామేమేమి యాచించినన్
దిరుగంజాలవు దుఃఖముల్వెనుకకున్ దీనమ్ములై తాపము
ల్కరగింపంగ నశక్తము, ల్సౌఖ్యమిక ఎం గట్టి ల్గ్రహింపంగ లే
వరయం దృష్ణనుఁ గూల్చఁగాదె తొలగున్ దుఃఖముల్వేసన్ బుద్ధుఁడా?

శా॥ తృష్ణాజన్మపరంపరం దునుమఁగా దృష్టి న్మరల్చందగున్
తృష్ణాయంబు సదా భజించినను నా యుష్షైన క్షీణించునే?
తృష్ణంభావము వీడి యింక వెస నాదుఃఖంబుఁ బోఁ ద్రోలఁగన్
దృష్ణం జంపఁగఁ బూనుఁడొందు నిదె సందృష్టిన్ గురూ! బుద్ధుఁడా!

చ॥ పరముగిరమ్ము లేదికను భావన సేయఁగ గొప్పపూజయు
న్మరణయు నిష్ఫలమ్ములను మర్మమెఱింగి చరింతు నింక నా
మరణము నీకు ధర్మమున మానవజాతి సముద్ధరింప నేఁ
దిరముగ శాసనేసి యిదె దీక్షఁ దగన్ స్వహాయింతు బుద్ధుఁడా!

చ॥ గరువము వీడి కానఁగు గౌరవమొప్పఁగ నీదు ధర్మమున్
బరువది తగ్గిపోదు భువి భారత భూమికొ కింతయు న్నికన్
గర మభివృద్ధిఁ జెంది కను గాఢమగున్ ధరం నీదు కీర్తియే
వరమయి నేటికిందనరు, వ్యాసుఁడు నీశుఁడుఁ గారు బుద్ధుఁడా!

